శ్రీ రామ.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమద్గోవింద భగవ
త్పాదశిష్య శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచితమగు

శ్రీ

# —: దృగ్దృశ్య వివేకము :—

ఇది

కడపతాలూకా కమలాపురముననుండు

ద్వైప శేషయ్యచే

రచియింపఁబడిన

తెనుగు పద్యములతోఁ జేర్చి

పులివెందలతాలూకా సురభి గ్రామముననుండు

అల్లపు రెడ్డి చెన్నారెడ్డిగారి

సాహాయ్యమున

కడప

కల్యాణ కుమార విలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపబడియెను.

**1906 సం॥ అక్టోబరు నె 12 ది.**



దీని వెల మాత్రము. **0-8-0.**

## —* పీఠిక (2) M

శ్లో॥ శ్రీరామస్స్మర్యతాం ధీరా! శ్రీరామో హృది భావ్యతాం।
శ్రీరామస్సేవ్యతాం నిత్యం శ్రీరామాన్నాస్త్యదస్తినః ॥

—:o:—

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్య స్వాములవారిచే జగదుపకృతికై ప్రసాదింపబడిన యీ దృగ్దృశ్యవివేకమను కృతిరత్నమును నేనాదరముతో జదివి దీనివిషయమును విమర్శింప నాకొదవిన పరమానందమున దీనిని తెలిగింపవలయుననుతలపు నాకుంబొడముటయూ నందులకు సద్గురువర్యు ననుజ్ఞవడసి యిప్పని నిర్విఘ్నముగ నెరవేరుటకై

శ్లో॥ హరినీలనీలమాగమమహాలం ముగ్ధవ్రజాంగనాలోలం ।
జగదుత్పత్తిస్థితిలయలీలం హృది కమపి భావయే బాలం ॥
తదంఘ్రికమలాలోల భ్రమరాయితచేతసం।
అఖండ జ్ఞానవైరాగ్యానంద కందళముద్భవం॥
తత్పాత్రమహాత్రత భూతాయ కింకరీభూత భూతయే ।
గోవిందరూపిణే సాక్షాద్గోవిందస్వామినే నమః॥
ప్రపద్యేతత్కృపాసిద్ధ సిద్ధిమూర్త్యభయశ్రియం।
నారాయణమునిం లోకపావనైకపరాయణం॥

సేవేతచ్ఛిష్యముఖ్యేణయోగి విద్యామహాబలం ।
శ్రీవేంకటేశ్వరం శ్రీమన్మునిమాలోపలాలితం ॥
తత్సుతం సముపాశ్రిత్య తత్త్వవిజ్ఞాన సంపదం ।
శేషాచలముపాసేఽథ బ్రహ్మవిత్కుల భూషణం ॥
శ్రీరాజయోగవిద్యాశ్రీ సముజ్జీవనపండితం ।
గురుసింహంచ తచ్ఛిష్యమశ్వత్థాభిఖ్య మాశ్రయే ॥

అని యస్మద్గురుపరంపరను

శ్లో॥ యత్కృపాలేశతః ప్రాప్తంయదిదం ధర్మసాధనం ।
తస్మాతాపితరౌ వందే లక్ష్మీనారాయణౌమమ ॥

అని యస్మజ్జననీజనకులను సంస్మరించి యారంభించి యీపని వారి యందలికృపచే సమగ్రమొనర్చితి.

ప్రకృతము, శ్రీభూమానందసమాజము సహాయకార్యదర్శిగారగు బ్రహ్మశ్రీ కోవూరు పట్టాభిరామయ్యగారిచే నింతకుమును తెలిగింపబడి యున్న శ్రీవివేకచూడామణి యీకృతియందలి యర్థమునే విపులముగా దెలుపునదిగాయుండియు నది జనులకందఱకు దెలియకయున్నందున నీసంగ్రహరూపమైన చిన్నగ్రంథమునైన నందఱుందెలిసికొనన జాలుదురుగాకని నేనీప్రయత్నము నొనరించితింగావున సత్పురుషులెల్లను దీనింజదివి యర్థమునుగ్రహించి కృతార్థులగుదురు గావుతమని పరమేశ్వరుం బ్రార్థించుచున్నాడను

— కడప,
12-10-1906.

కాప శేషయ్య.

శ్లో॥ రూపం దృశ్యం లోచనం దృక్తద్దృశ్యం దృక్తుమానసం।
దృశ్యాధీవృత్తయస్సాక్షీ దృగేవనతుదృశ్యతే ॥౩॥

తే॥ గీ॥ తోచునది రూపు రూపునుజూచు కన్ను ।
కన్ను తోచినచో దానిగాంచుమనసు।
తోచునవి బుద్ధివృత్తులు చూచునెపుడు ।
వానిదత్సాక్షి దాని నేదేనిగనదు ॥

శ్లో॥ నీలపీతస్థూలసూక్ష్మహ్రస్వదీర్ఘాదిభేదతః ।
నానావిధాని రూపాణిపశ్యేల్లోచనమేకధా ॥౪॥

తే॥ గీ॥ నలుపు పచ్చన లావుసన్నమును పొట్టి ।
పొడుగు మొదలగు భేదముల్ పొందినట్టి।
వివిధరూపంబులను నొక్కవిధముగాను ।
చూచుచుండును గాదె యాలోచనంబు ॥

శ్లో॥ ఆంధ్య[illegible]టుత్వేషు నేత్రధర్మేషు చైకధా ।
సంకల్ప[illegible]నశ్శ్రోత్రత్వగాదౌ యోజ్యతామిదం ॥౫॥

తే॥ గీ॥ గ్రుడ్డి మసకయు దీటయౌ గుణములెల్ల ।
కంటి విందును మనసు సంకల్పములను ।
నొక్కరీతిగనే చేయు ద్వక్కు చెవి మొ।
దలగు నన్నిటియందిట్లె తలపవలయు ॥

శ్లో॥ కామః సంకల్ప సందేహౌ శ్రద్ధాఽశ్రద్ధే ధృతీతరే।
హ్రీర్ధీర్భీరిత్యేవమాదీన్ భాసయత్యేకధా చితిః ॥౪॥

తే॥ గీ॥ తెలివి వెలుగుచు వెలిగించుతలపు గోర్కె ।
సందియంబును శ్రద్ధ నశ్రద్ధ ధైర్య ।
మద్ది లేమిని సిగ్గు భయంబు బుద్ధి ।
నిట్టివెల్లను చెప్పుడు నేకరీతి ॥

శ్లో॥ నోదేతి నాస్తమేత్యేషా న వృద్ధిం యాతి న క్షయం ।
స్వయం విభాత్యథాన్యాని భాసయేత్ సాధనం వినా ॥౫॥

తే॥ గీ॥ ఇట్టియీ తెల్వి పుట్టదు గిట్టదు మఱి,
పెఱుఁగ దెన్నఁ డీషైనను దఱుఁగ దెట్టి ।
సాధనము లేక తనుదానె సంతతమును ।
వెలుఁగు నన్యములను గూడ వెలుఁగఁ జేయు ॥

శ్లో॥ చిచ్ఛాయావేశతో బుద్ధౌ భానం ధీస్తు ద్విధా స్థితా ।
ఏకాఽహంకృతిరన్యా స్యాదంతఃకరణరూపిణీ ॥౬॥

తే॥ గీ॥ తెలివి నీడ ప్రవేశింప వెలుఁగు బుద్ధి ।
యదియు రెండు తెఱంగుల నలరుచుండు ।
నందహంకారరూపిణి యగు నొకటి ।
యన్యమంతఃకరణ సమాఖ్యను వహించె ॥

శ్లో॥ ఛాయాహంకారయోరైక్యం తప్తాయఃపిండవత్తతః ।
తదహంకారతాదాత్మ్యాద్దేహశ్చేతనతామగాత్ ॥౯॥

తే॥ గీ॥ తెలివినీడయహంకృతిఁ గలియుటరయ ।
దప్తమైనట్టి యినుపముద్దవలె నంతె ।
యయ్యహంకృతి తనువుదానగుటవలన ।
దనువు చేతనతనుబొంది యొనరుచుండు ॥

శ్లో॥ అహంకారస్య తాదాత్మ్యం చిచ్ఛాయాదేహసాక్షిభిః ।
సహజం కర్మజం భ్రాంతిజన్యం చ త్రివిధం క్రమాత్ ॥౧౦॥

తే॥ గీ॥ తెలివినీడను తనువును తెలియుదాని ।
తానునహమ్ము సంబంధమౌ నెఱుంగ ।
సహజమును కర్మజము భ్రాంతిజమ్మనంగ ।
వరుసగా ముత్తెఱంగుల నరసిచూడ ॥

శ్లో॥ సంబంధినోస్సతోర్నాస్తి నివృత్తిస్సహజస్యతు ।
కర్మక్షయాత్ప్రబోధాచ్చ నివర్తేతే క్రమాదుభే ॥౧౧॥

తే॥ గీ॥ అహమునతనీడతనుబుట్టునపుడె కూడ ।
బుట్టుసహజము విడుదల బొందదెపుడు ।
తెలుఁగగర్మము మఱిప్రబోధంబు గలుగ ।
మిగులు సంబంధములు రెండు నాగినశించు ॥

శ్లో॥ అహంకారలయేసుప్తౌ భవేద్దేహోఽప్యచేతనః ।
అహంకారవికాసార్ధస్స్వప్న స్సర్వస్తుజాగరః ॥౧౨॥

తే॥ గీ॥ అహము సుప్తిని లయమొందినపుడె కూడ ।
దనువచేతనమైయుండు వినుమహాత్మ ।
సగము వెల్గిన నపుడది స్వప్నమయ్యె ।
నంతయును వెల్గ జాగ్రత యయ్యెనయ్య ॥

శ్లో॥ అంతఃకరణవృత్తిశ్చ చితిచ్ఛాయైక్యమాగతా ।
వాసనాఃకల్పయేత్స్వప్నే బోధేఽక్షై ర్విషయాన్ బహిః ॥౧౩॥

తే॥ గీ॥ తెలివిలో నీడవలెనె తాగలిసికేలు ।
గాక యంతఃకరణవృత్తి కలను లోన ।
వాసనలనెల్ల గల్పించు బయట నింద్రి ।
యవిషయములను మెలకువయందు కేయు ॥

శ్లో॥ మనోఽహంకృత్యుపాదానం లింగమేకంజడాత్మకం ।
అవస్థాత్రయమన్వేతి జాయతేమ్రియతేతథా ॥౧౪॥

తే॥ గీ॥ మనము నహమును నైనది విను మొకటియు ।
ద్రవ్యమును జడమైన యంతఃకరణము ।
మూడవస్థలవెంబడి పోవుచుండు ।
బుట్టుచుండును మఱియు నె గిట్టుచుండు ॥

శ్లో॥ శక్తిద్వయంహి మాయాయా విక్షేపావృతిరూపకం।
విక్షేపశక్తిర్లింగాది బ్రహ్మాండాంతం జగత్సృజేత్ ॥౧౩॥

తే॥ గీ॥ ఆవరణమని విక్షేపమనియు రెండు।
కలవు శక్తులు మాయకు దెలియు మందు।
రెండవది లింగమాది బ్రహ్మాండమంత।
ముగను గల్గెడి జగమెల్ల దగసృజించు॥

శ్లో॥ సృష్టిర్నామ బ్రహ్మరూప సచ్చిదానందవస్తుని।
అబ్ధౌ ఫేనాదివత్సర్వ నామరూపప్రసారణా ॥౧౪॥

తే॥ గీ॥ నురుగు మొదలగునవియెల్ల శరధిలోన।
నధికముగదోచుభంగి బ్రహ్మంబునందు।
సచ్చిదానందములకంటె సర్వరూప।
నామములు నెక్కువగదోచినదియె సృష్టి॥

శ్లో॥ అంతర్దృగ్దృశ్యయోర్భేదం బహిశ్చ బ్రహ్మసర్గయోః।
ఆవృణోత్యపరాశక్తిస్సా సంసారస్యకారణం ॥౧౫॥

తే॥ గీ॥ లోనదృగ్దృశ్యముల భేదభానమదియు।
బయట బ్రహ్మమునకు సృష్టికయినభేద।
మదియు నింకొక్కయావృతి యనెడిశక్తి।
యావరించును సంసృతి నదియె చేయు॥

శ్లో॥ సాక్షిణః పురతో భాతం లింగం దేహేన సంయుతం ।
చితిచ్ఛాయాసమావేశా జ్జీవస్స్యాద్వ్యావహారికః ॥౧౮॥

తే॥ గీ॥ ఎదుటధీవృత్తి సాక్షికివిదితమగుచు ।
దనువుతో గూడి వెల్గునంతఃకరణము ।
తెలివి నీడయు తనయందు కలియుచుంట ।
వ్యావహారికుడనబడు జీవుడగును ॥

శ్లో॥ అస్య జీవత్వమారోపాత్సాక్షిణ్యప్యవభాసతే ।
ఆవృతౌతువినష్టాయాం భేదేభాతేఽ పయాతితత్ ॥౧౯॥

తే॥ గీ॥ దీని జీవత్వమెఱుంగమి గానవచ్చు ।
సాక్షియందున్నయట్లు విజ్ఞానదృష్టి ।
నావృతివశింప బ్రహ్మాసుగ్గాంతరంబు ।
దెలియ నెఱుంగమి దనయంత దొలగిపోవు ॥

శ్లో॥ తథాసర్గబ్రహ్మణోశ్చ భేదమావృత్య తిష్ఠతి ।
యాశక్తిస్తద్వశాద్బ్రహ్మ వికృతత్వేవభాసతే ॥౨౦॥

తే॥ గీ॥ అటులనే సర్గమునకు బ్రహ్మంబునకును ।
గలుగు భేదము శక్తి కప్పినిలిచి ।
యుండు నాశక్తి వశమున నాఱుకుండు ।
బ్రహ్మమగపడు వికృతిదాబడ్డయట్లు ॥

శ్లో॥ అత్రాప్యావృతినాశేన విభాతి బ్రహ్మసర్గయోః ।
భేదస్తయోర్వికారస్స్యాత్సర్గే న బ్రహ్మణి క్వచిత్ ॥౧౯॥

తే॥ గీ॥ ఇందునావృతి నశియించె నేని బ్రహ్మ ।
సర్గములయొక్క భేదము స్పష్టముగ బ్ర ।
కాశమొందును వాటివికారమెప్పు ।
డైన సృష్టినె కాని బ్రహ్మమున లేదు ॥

శ్లో॥ అస్తిభాతిప్రియం రూపం నామచేత్యంశపంచకం ।
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం ॥౨౦॥

తే॥ గీ॥ ఉన్న దనియును దెలియును నున్న దనియు ।
మంచిదనియును రూపనామంబు లనియు ।
నైదెయంశంబులంతట నందుచుండు ।
మొదటివే బ్రహ్మము జగత్తు తుదివిరెండు ॥

శ్లో॥ ఖవాయ్వగ్నిజలోర్వీషు దేవతిర్యఙ్నరాదిషు ।
అభిన్నాస్సచ్చిదానందా భిద్యేతే రూపనామనీ ॥౨౧॥

తే॥ గీ॥ నింగి గాలిని నిప్పున నీట మట్టి ।
యందునుం దేవతిర్యఙ్నరాదులందు ।
సచ్చిదానందములు వెల్గు సరణియొకటె ।
వెలయు రూపములును వేఱువేఱుగాను ॥

శ్లో॥ ఉపేక్ష్య నామరూపే ద్వే సచ్చిదానంద తత్పరః ।
సమాధిం సర్వదా కుర్యాద్ధృదయే వాఽథ వా బహిః ॥ ౨౪॥

తే॥ గీ॥ రూపనామంబులెల్ల నారూఢిబలము ।
కొలది ద్రోయుచు మదిగాని వెలినిగాని ।
సచ్చిదానందమాత్ర సంసక్తుడగుచు ।
వదలక సమాధిచేయగా వలయునయ్య ॥

శ్లో॥ సవికల్పో నిర్వికల్పస్సమాధి ర్ద్వివిధో హృది ।
దృశ్యశబ్దానువిద్ధేన సవికల్పః పునర్ద్విధా ॥ ౨౫॥

తే॥ గీ॥ హృదయమునను సమాధి దా రెండుతీర్ల ।
గాలు సవికల్పమని నిర్వికల్పమనియు ।
నందు దృశ్యానువిద్ధ శబ్దానువిద్ధ ।
ములన సవికల్పమిరుతెఱంగులగుచుండు ॥

శ్లో॥ కామాద్యాశ్చిత్తగా దృశ్యాస్తత్సాక్షిత్వేన చేతనం ।
ధ్యాయేద్దృశ్యానువిద్ధోఽయం సమాధిస్సవికల్పకః ॥ ౨౬॥

తే॥ గీ॥ చిత్తమునందు కామాదివృత్తులెల్ల ।
దోచునవి వాటినెల్లను జూచువాడ ।
నేననుచు దన్ను ధ్యానించెనేని దృశ్య ।
విద్ధసవికల్పకసమాధి సిద్ధమిదియె ॥

శ్లో॥ అసంగస్సచ్చిదానంద స్స్వప్రభో ద్వైతవర్జితః ।
అస్తీతిశబ్దవిద్ధోయం సమాధిస్సవికల్పకః ॥౨౭॥

తే॥ గీ॥ ఎందునంటక సచ్చిదానందమూర్తి ।
వగచు వాయంతవెగ్గెడు నద్వయుండ ।
నైతినను మాట గూడినయదియె శబ్ద ।
విద్ధసవికల్పకసమాధి వెలయ దెలుగ ॥

శ్లో॥ స్వానుభూతిరసావేశాద్దృశ్యశబ్దానుపేక్షితుః
నిర్వికల్పసమాధిస్స్యాన్నివాతస్థితదీపవత్ ॥౨౮

తే॥ గీ॥ తన్ను దాగనుచవిచేత నన్ని దృశ్య ।
ములను శబ్దములను ద్రోసిపుచ్చి గాలి
లేనిచోనుండు దీపంబులీలనిల్వ ।
నిర్వికల్పసమాధియౌ నిశ్చయమిదియె

శ్లో॥ హృదీవబాహ్యదేశేఽపి యస్మిన్కస్మింశ్చవస్తుని ।
సమాధిరాద్యస్సన్మాత్రాన్నామరూపపృథక్కృతిః ॥౨౯॥

తే॥ గీ॥ హృదయమునవలె బయటను నెదుటబోచు ।
వస్తువున సత్తుమాత్రముబట్టి నామ ।
రూపముల వేర్పరిచి కదద్రోయు నాస ।
మాధియీమాటిలోన నాద్యంబుగుమ్ము ॥

శ్లో॥ అఖండైకరసంవస్తు సచ్చిదానందలక్షణం ।
ఇత్యవిచ్ఛిన్నచింతేయం సమాధిర్మధ్యమో భవేత్ ॥30॥

తే॥ గీ॥ సచ్చిదానందములనెడి సంజ్ఞకలిగి ।
వేఱువేఱునుగానట్టి మాఱనట్టి ।
చవినిచ్చెడి బ్రహ్మవస్తువును నేనె ।
యనెడి వదలనిచింత మధ్యమసమాధి ॥

శ్లో॥ స్తబ్ధీభావోరసాస్వాదాత్తృతీయః పూర్వవత్ స్మృతః।
ఏతైస్సమాధిభిష్షడ్భిర్నయేత్కాలం నిరంతరం ॥31॥

తే॥ గీ॥ మఱియును జవిజూచు మత్తుచే నుఱకనిల్చు ।
టదియును మునుపటివలెనె మూడవసమాధి ।
యీసమాధుల నాఱింటనే సతతము ।
యోగికాలంబు గడుపుచు నుండవలయును ॥

శ్లో॥ దేహాభిమానే గలితే విజ్ఞాతేపరమాత్మని ।
యత్రయత్రమనోయాతి తత్రతత్రసమాధయః ॥32॥

తే॥ గీ॥ తనువు నేనను భ్రమపోయి తాను బ్రహ్మ ।
మనుచు లెస్సగ దెలిసిన వెనుక నెచ్చ ।
టెచ్చటికి బోవుమానస మచ్చటచట ।
నగుచునుండు సమాధు లయత్నముగను ॥

శ్లో॥ ఛిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే ॥౩౩॥

తే॥ గీ॥ తానె బ్రహ్మంబనుచు దన్ను దానెఱుంగ ।
దానహంకృతియనుముడి తానెవీడు ।
నదియు తామఱి యిదియొకో యనెడు సంశ ।
యములు నశియించు సర్వకర్మములు దెగును ॥

శ్లో॥ అవచ్ఛిన్నశ్చిదాభాస స్తృతీయస్స్వప్నకల్పితః ।
విజ్ఞేయ స్త్రివిధోజీవ స్తత్రాద్యః పారమార్థికః ॥౩౪॥

తే॥ గీ॥ జీవుడెన్నంగబడు నవచ్ఛిన్నుడనియు ।
స్వప్నకల్పితుడని చిదాభాసుడనియు ।
మూడు తెఱగులుగా నందు మొదటివాడు ।
పారమార్థికు డనబడువాడు చూడు ॥

శ్లో॥ అవచ్ఛేదః కల్పితస్స్యాదవచ్ఛేద్యం తు వాస్తవం ।
తస్మిన్ జీవత్వమారోపాద్బ్రహ్మత్వం తు స్వభావతః ॥౩౫॥

తే॥ గీ॥ ఉన్న [illegible] ।
డెందు కల్పితుడయ్యె నదేయబార్థ ।
మదియె జీవుడుగాదోచు నంతెగాని ।
బ్రహ్మమగుటది దానిస్వాభావికంబు ॥

శ్లో॥ అవచ్ఛిన్నస్యజీవస్యపూర్ణేనబ్రహ్మణైకతాం ।
తత్త్వమస్యాదివాక్యానిజగుర్నేతరజీవయోః ॥౩౦॥

తే॥ గీ॥ తత్త్వమస్యాదివాక్య సంతానమెల్ల ।
నాయవచ్ఛిన్ను నకు బూర్ణమై వెలుంగు ।
నట్టి బ్రహ్మంబుతోడ నైక్యమును జెప్పు ।
నది తదన్యములగు జీవులందు గాదు ॥

శ్లో॥ బ్రహ్మణ్యవస్థితామాయావిక్షేపావృతిరూపిణీ ।
ఆవృత్యాఖండతాంతస్మిన్ జగజ్జీవౌప్రకల్పయేత్ ॥౩౧॥

తే॥ గీ॥ రూఢినావృతి విక్షేపరూపిణియగు ।
మాయ బ్రహ్మమునందుండి మఱియుదాని ।
దగునఖండత నంతట నడ్డగించి ।
దాన జగమును జీవునిదా సృజించు ॥

శ్లో॥ జీవోధీస్థచిదాభాసోభవేద్భోక్తాహికర్మకృత్ ।
భోజ్యరూపమిదం సర్వంజగత్స్యాద్భూతభౌతికం ॥౩౨॥

తే॥ గీ॥ బుద్ధినున్నట్టితోచు జీవుండెయెల్ల ।
పనులసేయుచు నయ్యయిఫలము గుడుచు ।
భూతపంచకమును దానబుట్టుసర్వ ।
వస్తుసమితియు భోజ్యరూపములె యగును ॥

శ్లో॥ అనాదికాలమారభ్య మోక్షాత్పూర్వమిదంద్వయం ।
వ్యవహారేస్థితంతస్మాదుభయం వ్యావహారికం ॥౩౯॥

తే॥ గీ॥ మొదలులేనట్టి కాలము మొదటినుండి ।
మోక్షకాలమువరకు నీమున్న జెప్పి ।
నట్టి రెండును వ్యవహారమందెయుంట ।
వ్యావహారికములునాఁవె వ్యక్తముగను ॥

శ్లో॥ చిదాభాసేస్థితా నిద్రావిక్షేపావృతిరూపిణీ ।
ఆవృత్యజీవజగతీ పూర్వేనూత్నేతుకల్పయేత్ ॥౪౦॥

తే॥ గీ॥ మఱపు నెఱుకయుం నగుచుండు మాయ నిద్ర ।
నెఱిని నీడను జేరి మున్గలిగియున్న ।
జీవుని జగమ్ము గప్పుచు జేయుచుండు ।
క్రొత్త జీవ జగత్తుల గోట్లకొలది ॥

శ్లో॥ ప్రతీతికాలఏవైతేస్థితత్వాత్ప్రాతిభాసికే ।
నహిస్వప్నప్రబుద్ధస్య పునస్స్వప్నేస్థితి స్తయోః ॥౪౧॥

తే॥ గీ॥ జీవజగములు ప్రాతిభాసికనియుండు ।
ముందు నవి తోచినప్పుడే యుండవవల ।
కలనుగని మేలుకొన్న యవ్వలనుజూడ ।
కానవచ్చునె యవిరెండు కలనుమఱల ॥

శ్లో॥ ప్రాతిభాసికజీవోయ స్తజ్జగత్ప్రాతిభాసికం ।
వాస్తవంమన్యతేఽన్యస్తుమిథ్యేతివ్యావహారికః ॥౪౨॥

తే॥ గీ॥ స్వప్న కల్పితజీవునికగపడు స్వప్న ।
కల్పితము దాని సత్యంబుగాఁ దలంచు ।
నతఁడు; మఱియన్యుఁడౌ వ్యావహారికుండు ।
దానినే మిథ్యయనుచును దలఁచుచుండు ॥

శ్లో॥ వ్యావహారికజీవోయ స్తజ్జగద్వ్యావహారికం ।
సత్యంప్రత్యేతిమిథ్యేతిమన్యతే పారమార్థికః ॥౪౩॥

తే॥ గీ॥ వ్యావహారికు లోకంబు వ్యావహారి ।
కంబు దాని నతండు సత్యంబటంచు ।
దలఁచుచుండును మఱియు నద్దాని సేయ ।
సత్యమని పారమార్థిక సంజ్ఞుఁడెంచు ॥

శ్లో॥ పారమార్థికజీవస్తు బ్రహ్మైక్యంపారమార్థికం ।
ప్రత్యేతివీక్షతే నాన్యద్వీక్షతేత్వనృతాత్మనా ॥౪౪॥

తే॥ గీ॥ పారమార్థికజీవుండు బ్రహ్మమొకటె ।
సత్యమనియెంచు మఱిదాని వాయఁజూడ ।
డటుల జూచినచో నతండన్యమెల్ల ।
మిథ్యయని చూచుచుండుట తథ్యమరయ ॥

శ్లో॥ మాధుర్యద్రవశైత్యాదిజలధర్మాస్తరంగకే ।
అనుగమ్యాథతన్నిష్ఠే ఫేనే౽ప్యనుగతాయథా ॥౪౫॥

తే॥ గీ॥ జలముగుణములు రుచి తేమ చల్లదనము।
నాజలం బలయైనప్పు డుండు దోచి ।
యంత వదెయగు ఫేనంబునందు సైత ।
మెడప కగపడుచుండెడు వడువుదోప ॥

శ్లో॥ సాక్షిస్థాస్సచ్చిదానందాస్సంబాధాద్వ్యావహారికే ।
తద్ద్వారేణానుగచ్ఛంతితథైవప్రాతిభాసికే ॥౪౬॥

తే॥ గీ॥ సచ్చిదానందధర్మముల్ సాక్షియయ్యు ।
సాక్షి యేవ్యావహారికుండౌటనతని ।
యందుగనబడు; నంతట నందునుండి।
ప్రాతిభాసికునందునువ్యాప్తి జెందు ॥

శ్లో॥ లయే ఫేనస్యతద్ధర్మాద్రవాద్యాస్స్యుస్తరంగకే ।
తస్యాపివిలయే నీరేతిష్ఠంత్యే తేయథాపురా ॥౪౭॥

తే॥ గీ॥ అంత లయకాలమాసన్నమైన చెమ్మ।
మున్న యిన ఫేనధర్మముల్ బొందునలను ।
నదియునశియింపమునుపటియట్టులవ్వి ।
మూడు నెలగొనునీట నాపోల్కి తెలియ॥

శ్లో॥ ప్రాతిభాసికజీవస్యలయేస్యుర్వ్యావహారికే ।
తల్లయేసచ్చిదానందాఃపర్యవస్యంతిసాక్షిణి ॥౪౬॥

—: సమాప్తోఽయంగ్రంథః :—

తే॥ గీ॥ ప్రాతిభాసికులయముసంప్రాప్తమైన ।
నందుదోఁచినసచ్చిదానందసమితి ।
వ్యావహారికుజెందును నతడుసమయ।
నవ్వియెప్పటియట్లుండు సాక్షియందు ॥

—: ఈగ్రంథము ముగిసెను :—

క॥ సకలశ్రుతిసారఝరీ । వికిరద్వివిధాభిధానవేద్యా! కుమన ।
స్సుకుమారజనకతనయా । మకరాంకాతంకహరణమహితవిలాసా! ॥

ఓం తత్సత్.

—:o: (o) :o:—

తే॥ గీ॥ వట్టిమాటలతో ముక్తి గిట్టదనుచు ।
గట్టిగాసమ్మి వాగుట మట్టుపఱచి ।
పెద్దలకు సేవజేసినే పెుద్దునైతి ।
నున్న మతిపోయె నూఱకయుంట మిగిలె ॥

తే॥ గీ॥ ఇట్లు కౌండిన్యగోత్ర మహీసురుండ ।
యాజుషుడ వైప నారాయణయ్య కతని ।
పత్ని లక్ష్మమ్మయందు జాపట్టినట్టి ।
శేషయను వ్రాసినాడ నీచిన్న కృతిని ॥

ఉ॥ చిన్న దియైయయ్యు స్తోబలుకు చేడియయాదల ద్రాల్చునామ్మురీ।
తిన్న లునైనపాత్రమిది; దీనినినేదెలిగింపజూచి మా।
చెన్న యరెడ్డి రోగి గురుసింహము శిష్యుడు మెచ్చియచ్చువే ।
యన్న నుబూన్చి తోడుపడి సొంతముజేసె జగద్ధితంబుగన్ ॥

క॥ ఋతుగగనాశేంద్రుక్రమ । మితహాయనాబ్దమున కూరిమిని నిది యాంధ్రీ। కృతమయ్యె నీకుకృప నీ। కృతి యాచంద్రార్కముగ ధరిత్రి వెలయుతన్ ॥.

శ్లో॥ శ్రీరామ స్సర్యతాం ధీరా! శ్రీరామోహ్యాదిభావ్యతాం ।
శ్రీరామస్సేవ్యతాం నిత్యం శ్రీరామాన్నా స్యదస్తినః ॥

—: మంగళమ్ :—

